14. సకల తపస్సుల ఫలమగు శ్రీహరినామమును మరువకుండుటయే జన్మసాఫల్యము.

15. మరణము-మానవుడు-మాధవుడు-సకల సుఖములు సకల దుఃఖములు-స్వర్గనరకములు ఆత్మే.

16. అన్యము (అధ్యాస) తదధిష్ఠానము ఆత్మే, భ్రాంతివలన ఏమేమో అనుకుంటారు. అంతయు ఆత్మ విలాసమె. అస్తు.

17. శరీరము ఉన్నా ఆత్మకు అభిన్నమె. శరీరము పోయినా ఆత్మకు అభిన్నమె, రాకపోకలు ఆత్మయందు అధ్యాసయే. అధ్యాసకూడ ఆత్మే.

18. శ్రీహరిని మరచుటకన్న-ఆయన నామమును మరచుటలో ఎక్కువ కష్టము లున్నవి.

19. మానవుడు సావధానుడై సతతము తనజీవితము సత్పురుషులవలె గడచుచున్నదా! లేక పశువులాగ గడచుచున్నదా! యని జూచుకొనవలయును.

20. పితృ, గురు, జనని, బంధు, పతి దైవతంబులలో నెవ్వరె నను సంసారరూప మృత్యురహితంబైన మోక్షమార్గంబు జూపకుండిరేని వా రెవ్వరును హితులు గానేరరు.

21. సర్వఫలములకు ఫలస్వరూపము భగవన్నామము.

22. భోగవాసనలను నశింపజేయును-హరినామము

23. పవిత్రమునకు-పవిత్రము, మంగళమునకు మంగళము భగవన్నామమే.

24. సర్వేశ్వరుని నామారాధన సర్వలోకాల వారికి మంగళప్రదమగు అద్వితీయ సాధన.

25. సోమసూర్యాగ్నుల మించిన స్వప్రకాశము రామనామము.

26. సర్వకాలములందు మేలుకోరు మిత్రము భగవన్నామము.

27. సకలతీర్థములు, దానములు, కర్మలు-వీని యొక్క ఫలమే సత్పురుషదర్శన, సల్లాపములు.

28. చెట్టుకుపిందె పుడుతుంది. అది వగరు,పులుపు గలిగివుంటుంది. అది చెట్టునే వుంటె పక్వమై పండు అవుతుంది.ఆలాగుననే భగవన్నామాన్ని వదలకుంటె మనస్సు క్రమంగా పక్వమయి పరమాత్మునియందు హత్తుకొని పోతుంది.

29. ఏవిధంగానైనా సరే నామకీర్తన, జపము వదలకుంటేచాలు. మనస్సుకోలి వదిలేసెయ్యి. నామం జూచుకుంటుంది.

30, భగవంతుని నమ్మినవారికే, విశ్వసించినవారికే పరమశాంతి లభించును.

31. ప్రాపంచిక వస్తువుల అధీనమందుండుట బుద్ధి మంతునకు, సారగ్రాహిఅయిన మానవునకు నరకసమానముగ దోచును.

32. ఏడవకుండా, దుఃఖంలేకుండా ఎవరు భగవంతుని పొందగలరు?

33. మానవుడు, భగవంతుడు ఏదో ఒకరూపంతో ఎప్పుడు సన్నిహితుడై యుంటా డని విశ్వసించిన ఎంత ఆనందముగానో ఉండగలడు. సుఖసమయంలో కంటే దుఃఖసమయంలో విశేషించి సన్నిహితంగా యుంటాడు.

34. అంతఃకరణము శాంతిగా యుండుటకు ఉపాయము, అన్ని విషయములయందు భగవదిచ్ఛానుసారంగా నడచుటయే.

35. ఎల్లప్పుడు గలసియుండుట కేవలము అనాదరమునకు గారణము. పవిత్రమగు గంగాజలమును విడచి గంగ సమీపమునవుండు మనుష్యులు పారిశుద్ధ్యమునకు నూతుల దగ్గరకు వెళ్ళెదరు. అటులనే సత్పురుషులవద్ద వుండువారు సత్పురుషులను గౌరవించలేరు.

36. స్వామీ! మీకు భయముకలదా?–నాకు పెద్ద భయము కలదు. అదేది? "కోరికలనిన"

37. స్వామీ! మీరు సంకీర్తన ఎందుకు చేయు చున్నారు? ప్రచారమునకా? కాదు నాయనా! సంకీర్తన చేయడం నామానికి సేవచేయడం.

38. దుఃఖానికి కారణం దేహబుద్ధి. సుఖానికి కారణం ఆత్మబుద్ధి.

39. భగవన్నామ మహిమకు శివసాయుజ్యము, బ్రహ్మపదవి గూడ సరిరావు.

40. భగవంతునికి–భగవన్నామానికి భేదంలేదు.

41. సత్సంగం దొరికితే సర్వైశ్వర్యము లభించినట్లే గదా!

42. కలిలో సత్సంగం అయిదునిముషము లయి నను చాలు, మానవుడు తరించడానికి.

43. తల్లి, తండ్రి, హితులు, సోదరులు, భార్య, పుత్రులు, వీరిలో ఒక్కొక్కని వలన ఒక్కొక్కలాభమే కలుగును. సర్వలాభములు కేశవునివలన కలుగును.

44. అనేక జన్మల తపస్సంపన్నతచే భారతభూమి యందు జన్మదొరుకును. ఇక్కడే ముక్తిసంపన్నత.

45. జ్ఞానంవలన అహంకారం పోతుంది. భక్తి వలన మమకారం నశిస్తుంది.

46. ధ్యానానికి యెక్కువ ప్రాధాన్యం యివ్వటం చాలమంచిది. ఆంతరిక సాధన చాలా మంచిది. మానసికముగా భగవత్ లీలాచింతనం మహోపకారం జేస్తుంది.

47. అవసరమైనగురుసేవ భగవత్ప్రాప్తికిమూలం.

48. శ్రీహరిని సర్వభూతమయునిగా దెలిసి, భక్తులైనవారు సకల భూతములయందును నిశ్చలమైన భక్తి జేయవలయును.

49. సర్వభూతస్వరూపుడగు భగవంతుని వీడు పుణ్యాత్ముడు, వీడు పాపి, వీడు దురాత్మురుడు అనుప్రసక్తి వదలి సర్వత్రవున్న నారాయణుని భజించవలెను.

50. మనస్సు బహిర్ముఖముగనున్న విపత్తులకు లోటు ఏమీవుండదు. బహిర్ముఖ మనస్సే సర్వానర్థకారణము.

51. నేను అబాధ్యము, అనామయము, అజరము, అనన్యము. అట్టి అపరిచ్ఛిన్నముగనున్న నేనును ఎవరు కుంగదీయుదురు? బాధింతురు?

52. మనసు చెడ్డది. మోసం చేయిస్తుంది, మోసంలో పడేస్తుంది. దానికి విరుగుడు శ్రీరామనామమే అందరికి గతి అని మహాత్ములు చాటినారు.

53. గాయత్రీజపము మాత్రముచేతనే బ్రాహ్మణుడు సిద్ధిపొందగలడు.

54. తల్లి, తండ్రి, గురువు, దైవతము-భగవద్విభూతులు. వీరిసేవ వలన భగవదనుగ్రహము తప్పదు.

55. మాతాపితలు ప్రత్యక్ష దేవతలు. వీరిసేవ వలన భగవదనుగ్రహము అతిసమీపము.

56. రోగి మనోవాక్కాయ కర్మలతో మందులు తీసికుంటున్నా అసలు ఆత్మబలం కావాలి.

57. ఏసమయంలో దేహబుద్ధిగలచోట దైవబుద్ధి యుంటుందో ఆరాత్రులన్ని శివరాత్రులే,

58. భగవన్నామము చిత్తమునందలి భోగవాసనలను బోగొట్టును.

59. భగవత్స్మరణతో జరుగుపనులన్నియు శివమయములే.

60. భౌతికముగా యీదేహము ఎవరిదో వారిని జపించుట మానవుని ధర్మం.

61. కంటికి కనుపించున దంతయు నశించునదే. ఒక్క భగవన్నామమే నశించనిది.

62. తన ప్రాణులు భగవత్పరమే యని నిశ్చయబుద్ధితో ప్రవర్తించుటయే అత్యుత్తమకోటికి చెందిన సాధన.

63. ఈసృష్టిలో భగవంతుండంత దయగలవారు లేరు.

64. శరీరా లస్థిరాలు. శరీరి సుస్థిరుడు.

65. యతులకు మరణం—మంగళం.

66. భగవంతుని కిష్టంలేకపోతే రాయవంటి శరీరంగూడ రెప్పపాటుకాలం వుండదు.

67. ఆయన వుంచదలిస్తే వూడిపోతున్నట్టున్న శరీరంతోనే అద్భుతంగా సేవలు అందుకుంటాడు.

68. జీవునికి, ఉత్తమసేవ ఒక్క భగవన్నామమే.

69. శ్రీమద్భాగవతం తాపత్రయోన్మూలనం. సత్యం!

70. సకల సాధనలలో శ్రీమద్భాగవత శ్రవణ—పఠనములు శ్రేష్ఠమైన సాధన.

71. సగుణము-నిర్గుణము అంతయు బ్రహ్మస్వరూపమే.

72. సత్పురుషులుగల స్థలములు పరమ పవిత్రములు.

73. ఈశ్వరేచ్ఛను ఎవరును ఉల్లంఘించలేరు.

74. రెప్పపాటుకాలమైన సత్సాంగత్యం మహాలాభం.

75. నేను దేహమను బుద్ధియే నరకము-అది కలవాడే నరకుడు. దానిని నశింపజేసికొని, స్వయంజ్యోతియగు ఆత్మగా వెలుంగుటే దీపావళి పండుగ.

76. సాధకుడు మితముగ మాటాడవలెను. మిత్ర ముగా పరుండవలెను. ప్రాపంచిక విషయములనుండి అలిప్తుడుగా నుండుటకై ప్రయత్నించవలెను.

77. త్యాగవైరాగ్యములులేనిచో భగవత్ప్రాప్తి గలుగదు.

78. ఒకభక్తుడు 72 సం. ములు సాధన సినను తనదగ్గర నున్న రెండువస్తువులను విడుచువరకు భగవత్ప్రాప్తి గలుగలేదు.

79. సాధకుడు ఎంతెంత శ్రద్ధగలవాడగునో అంతంతగా విపత్తులు సంపత్తులుగా మారును. శత్రువులు మిత్రులగును. జగత్తు ఇష్టదేవుని స్వరూపముగా నుండును.

80. ఖాళీసమయంలో నోటితో భగవన్నామం జేయుచుండుము. తత్ఫలితంవల్ల మనస్సు అన్యాయత్తం గాదు. నోటితో అభ్యాసఫలమే మానసికము.

81. హరిభజన జేయనివాడు దుర్దైవులు. అనగా దురదృష్టవంతులు.

82. హరిభక్తియే యథార్థమైన భాగ్యము. హరిభక్తివలన భయ, మోహ, చింతలనుండి విముక్తి గలుగును.

83. నీకు ఆయన్ని (భగవంతుని) ప్రేమించటం చేతకాకపోయినా ఆయన సతతము నిన్ను తననుగా ప్రేమిస్తున్నా డని గుర్తుంచుకొనుము.

84. నిష్కామ నామస్మరణ వలన పాపము తొలగి సత్వగుణము వృద్ధి పొందును.

85. అన్ని ధనములకన్న నామధనము గొప్పది, తరగనిది, ఖర్చైనకొలది పెరుగును.

86. నిత్యము నిష్ఠతో భగవన్నామ జపం జేయువారు దుర్లభ మని జ్ఞానేశ్వరులనినారు.

87. కొనఊపిరి ఉన్నంతవరకు శరీరముద్వారా హరినామసంకీర్తనలు జేయించుకుంటే యింక కావలసినదేమున్నది ?

88. భౌతికధనం ఇహంలో సుఖాన్ని యివ్వవచ్చు, దుఃఖాన్ని యివ్వవచ్చు. గాని ఆధ్యాత్మికధనం, వాసుదేవు డనే ధనం పరమశాంతినే ప్రసాదిస్తుంది. అభయదానాన్ని యిస్తుంది.

89. వాసుదేవ తత్పరుడే సర్వధర్మఫలాన్ని అందుకునేది.

90. అందరినివదలి భగవంతునితో సంబంధం పెట్టుకోవటం భక్తి యంటారు.

91. ఈజన్మలో నేను తరించకపోతే నరకమైనను అనుభవించెదను. గాని వాసుదేవుని వదలను యని దృఢనిశ్చయముతో నుండుము.

92. గాలిపడగ ఎంతదూరంలో నైనా వుండనీ, దారం నీచేతిలో వుంటే అది మనస్వాధీనమే నన్నమాట, అలాగే భగవన్నామాన్ని పట్టుకొన్నావా భగవంతుని పట్టుకున్నట్లే. "రామకృష్ణ"

93. వాసుదేవసేవే అక్షయమైననిధి. అది అనంతం అవ్యయం, సచ్చిదానందమయం. అసలుసుఖం అదే. మిగిలిన సుఖాలు అంతం గలవి. అసత్యములు.

94. మనసు యెలాఉన్నా అభ్యసించితే నిరంతరం భగవన్నామము జరుగగలదు.

95. రోజుకి 3 నిముసములు కంటికి కనబడు, లేక మనస్సునుతోచు వస్తువులకు, ప్రాణులకు – (చరాచరములు) నీయిష్టదేవునిగా భావించి చేతులు జోడించి వందనము జేయుము. ఎన్నో పూజల ఫలం వస్తుంది.

96. ధనవంతు డగుట దైవయోగము కాదు. తన ధనమును తానైనా అనుభవించుట భగవదనుగ్రహము.

97. ధనము సంపాదించుట దైవయోగముగాదు. సంపాదించినది సద్వినియోగము చేయుట భగవ దనుగ్రహము.

98. నీవు నామంచెయ్యి. ఆ నామధారి విడువక ని న్నంటి పెట్టుకుంటాడు.

99. నీవనుభవించు ప్రతిది భగవంతున కర్పించి యనుభవింపుము. అంతయు నాయన యిచ్చినదేగా. ఈ భావము మరువరాదు.

100. మనస్సు బాహ్యవిషయములందు ఇట్టే తన్మయం అవుతూ యుంటుంది. దానిని భగవత్పరం జేస్తూ వుండటమే మనప్రయత్నం. దానికి భగవంతుడు ఎంతో బలాన్ని యిస్తాడు.

101. పాపం వుందనుటకు గుర్తేమిటి?మనస్సులో వాసన లుండుటయే. వాసనలు పాపబీజములు.

102. భగవంతు డగ్నితో సమానంగా అందరి దుఃఖములను పోగొట్టును.

103. నాకు నీకర్మములు అవసరములేదు. వాటిని వదలి నాయొక్క శరణు నొందుము-భగవదాజ్ఞ.

104. నాగురించి నీయొక్క అభిమానాన్ని వదలి పెట్టుము-భగవంతుడు.

105. తనకు తనను అద్వితీయ బ్రహ్మనని ఎరుంగుటయే అజ్ఞానము.

106. నీయొక్క బుద్ధి నిశ్చయించినా, నిశ్చయిం చకపోయినా నీవు బ్రహ్మవే. బుద్ధి నీయందు కల్పితం.

107. అవిద్యానివృత్తి తత్వజ్ఞానంతో కలుగుతుంది

107. శరీరాదులు మిథ్య యని తలచక, సాధనను మిథ్యయని తలచినవారు మాత్రము ఆత్మద్రోహులౌదురు

109. ఈశ్వరునియందు విశ్వాసముంచితే ఆచార దోషం నివర్తక మౌతుంది.

110. వాసనా నివృత్తికొరకు ఈశ్వరభక్తి ఆవ శ్యకము.

111. ఈశ్వరుని విశ్వాసముంటే సంసారికమైన యోగక్షేమముల చింత తొలగి పోతుంది.

112. సంసార వివేకమే పరమార్థము. అట్టివివేకం కావలిస్తే ఈశ్వరుణ్ణి విచారించుము.

113. అంతా వాసుదేవుడు-అట్టి బుద్ధిగలిగితే సంసారమునం దనురాగ ద్వేషములు వదలిపోవును.

114. సర్వత్ర సమానరూపంతో యుండు ఈశ్వ రుని చూచుట (సమం)

115. ఆత్మఘాతకు డెవడు? పరమాత్మను తెలి యనివాడు.

116. జ్ఞానస్వరూప మగు తనను అజ్ఞాని ననుకొ నుట ఆత్మహింస.

117. భగవన్నామం యోగసారం. భక్తిక్రాణం జ్ఞానస్వరూపం అనంతం. అఖండం, అవ్యయం, అనామయం, ఆత్మస్వరూపం, స్వసుఖం.

118. మానవునకు ఆస్తి మాధవుడుగాని మాయ గాదు.

119. మాధవుని స్మరింపక, ఆశ్రయింపక మానవుడు మాయను తొలగింప జాలడు.

120. అంతంగలది మాయ-అనంతుడు భగవంతుడు

121. ఇతరుల మంచిచెడ్డలు వినవలదు-అనవలదు. ఈ రెంటిలో ఏ ఒక్కటి వున్నా నష్టము పొందుదురు.

122. ఎన్నికష్టములు వచ్చినను భక్తుల సాంగత్యమునుండి దూరము చేయరాదని భగవంతుని ఎల్లపుడు ప్రార్థించవలయును.

123. భగవద్భక్తులు ధర్మమునే ఆశ్రయించి యుందురు. వారి కదియే కవచము.

124. భగవన్నామ భగవత్కథలు శరీరం వదలువరకు విన్నవారు ధన్యులు.

125. ఆశ్రమాలలో కలిప్రవేశం తక్కువగాలేదు. (ఎక్కువ)

126. భగవన్నామముఎక్కడుంటే అక్కడే సర్వతీర్థ క్షేత్ర-యజ్ఞ-యాగ ఫలములు వచ్చి సేవించుచుండును.

127. ఆత్మకే జీవుడని, జగత్తని-ఈశ్వరుడని. అంటే ఆత్మేతర మందనుకొనుట పొరపాటు.

128. జ్ఞానప్రాప్తి సాధనలో సాధకునకుముఖ్యంగా ఇతరుల మంచిచెడ్డలకు బోకుండా యుండాలి. నిందాస్తుతులు సాధకునకు పనికిరావు. ఈ పాడుమనస్సుకు బాగా యీాదురలవాటు యిష్టము. ప్రయత్నపూర్వకముగా ఈ ఆత్మఘాతకము జేసే దుష్టస్వభావాన్ని తరిమెసెయ్యాలి

129. తన పాపములవలెనే ఇతరుల పాపములను తలంపని వానికి పాపములు సంభవించుటకు కారణము లేదు.

130. ఎవడు మనస్సుచేతగాని, వాక్కులచేతగాని శరీరముచేతగాని ఇతరులకు అపకారము జేయునో, వానికి అట్టికర్మ యనెడి ఫలము గలుగుచున్నది. గొప్ప దుఃఖమున్ను గలుగుచున్నది.

131. భగవన్నామము ముందర విషము-అమృతము.

132. ముఖ్యసాధన ఉన్నది ఉన్నట్లు పలుకుటయే.

133. సంగం అంటే వాసన-సంగం పోవాలంటే సత్సంగం.

135. సుఖదుఃఖాలకు అతీతమైన ఆనందమే "నేన"ను స్ఫురణ కలుగవలయును.

135. భగవన్నామం పరమార్థగాములకు సంబళం.

136. నామజపంవలన భుక్తి-ముక్తి - మోక్షం అరచేతికొస్తుంది.

137. నామజపంవలన మృతత్వంపోయి అమృత మయం అని తోస్తుంది.

138. నాలుకలో వున్న అసత్యమనే మైల నశిం చాలంటే ఒక్క హరినామంతోనే నశించాలి. తీర్థోద కాలతో కడిగితే పోదట.

139. క్రియా, కర్మ, ధర్మల చింత మాని నామ ధనాన్ని పుంజుకున్నవారు ధన్యులు.

140. నామం అమృతంయొక్క నిధి.

141. సమ్యక్ కీర్తన-సమ్యక్ జ్ఞానమె.

142. నామముతో యోగము-సమాధిసాటికావు.

143. రామానుగ్రహమున జడచేతనము లన్నిటికి ఉచ్చస్వరముతో భగవన్నామములు వినిపించే భాగ్యమే భాగ్యము.

144. సంసారములో సుఖప్రదము - సద్యోఫల దాయకము ఒక్క సత్పురుష సాంగత్యమే.

145. గౌరవముగల స్థలమువలన దేహాధ్యాస అధిక మగును. అట్టి స్థలములకు దూరముగ నుండవల యును.

146. హరినామ మహిమ భక్తులకు వినిపించవలెను, విముఖులకు వలదు.

147. ఎంతో పుణ్యముచేసి సంపాదించుకొన్న జన్మను అనేకమంది మట్టిపాలు చేయుచున్నారుగదా!

148. సకాలమృత్యువాత్పు వారందరికి నారాయణ స్మరణలు.

149. స్వధర్మానుష్ఠానం విడచి నామస్మరణ చేయుట వృథ.

150. పరోపకారపరాయణులకు ప్రారబ్ధము అతి వేగముతో ముగియుచుండును.

151. అగాధమైనదని అనుకుంటున్న ఆత్మవస్తువు అత్యంతం సులభమనుమాట అరటిపండొలచి యిచ్చినట్లు అందరకు అందుతుందని సాధక సత్పురుషుల అభిప్రాయం.

152. ఎవరి నాలుకమీద ఎల్లప్పుడు శ్రీహరి నామము ఆడుచుండునో వాడే మానవుడు.

153. హరిస్మరణ లేనివాడు మానవు డయ్యు-మానవుడు కాడు.

154. మూడు యుగములలోని ఫలము కలిలో కేవలము హరినామము యిచ్చును. సత్యము.

155. అన్నియింద్రియముల సుఖము యిచ్చునది భగవన్నామమే.

156. ధ్యాన, జప, తప, యోగ, సంకీర్తనాదులు చెయ్యటం సులువే మోగాని నిరహంకారంగా సాధుసేవ చేయటం సుదుర్లభం.

157. జడ మనుకుంటున్న ఔషధంగూడా యెంత సుకృతం చేసుకుంటేనో మహాత్ముల నోటిలో పడుతుంది.

158. భగవంతుణ్ణి గురించి చెప్పడం ఎంత అసాధ్యమో, అంతకన్న అసాధ్యం భక్తుణ్ణిగురించి చెప్పటం.

159. సారగ్రాహులైనవారు బట్టను (కాషాయం) చూడకుండానే మాటతో మహాత్ముని స్థాయిని అందుకుంటారు.

160. ఉంచదలిస్తే వుంచుతాడు. ఇష్టం లేకపోతే అవతల ఒకసెకండు ఆలస్యం గాకుండా పారేస్తాడు.

161. నిందాస్తుతులులేక, పెట్టినదానితో తృప్తి, పిలవకుండా వెళ్ళకుండుట, ఓర్చుకొనుట యీ నాల్గు లక్షణములు ధామనిష్ఠవలన కలుగును.

162. హరినామము రోగ, శోకములను నశింపజేయును.

163. అసారమైన సంసారమున సారమైనది భగవన్నామమే.

164. "ఆత్మ" భోగమువలన, కర్మవలన వృద్ధి క్షయములు గలిగి యుండదు.

165. మనస్సులోకివచ్చి పోయినవాటితో బ్రహ్మ జ్ఞానికి ఇసుమంతయు చింత యుండదు.

166. మానవుడై జీవించుచు యెవడు వాసు దేవుణ్ని స్మరించడో వాడు గొప్ప నష్టమును పొందు చున్నాడు.

167. అత్యంత దుస్తరమైన మానసిక పాపము లతో దూషితమైన హృదయము గలవాడైనప్పటికీ విష్ణు భగవానుణ్ణి స్మరించినట్లయితే అతడు లోపల బయట పవిత్రుడవుతాడు.

168. తులాపురుష దానము (పురుషుణ్ణి తూచిన స్వర్ణము), రాజసూయ-అశ్వమేధాది యజ్ఞములయొక్క ఫలము విష్ణుస్మరణఫలము తో తుల్యము గాజాలదు.

169. కలియుగంలో వేదవిహితమైన కర్మాను ష్ఠానములు సరిగా జరగవు. కేవలం హరిస్మరణ సంపూర్ణ ఫలాన్ని ప్రసాదిస్తుంది.

170. రాముని రాముడై చూచినవాడు పొందే పరమానందము, పరమనిత్యసుఖము; రాముని కన్యమై దర్శించుటలో అంత ఆనందము లభింప నేరదు.

171. రామునిలో తన్మయుడవై పంచదార బొమ్మ నీటిలో కలసినప్పుడు తద్రూపమును చెందులాగున దర్శించిన, దర్శించుటయే యథార్థ శ్రీరామదర్శనమునకు ఆదర్శనీయము.

172. నామము చేయగాచేయగా ఆవక్కనామమే కృతార్థు నొసంగును.

173. నామజపమువలన ఆత్మారాముని అభిన్న దర్శనముకూడ జరుగును.

174. నిరంతర నామకీర్తనచే నామ–నాములకు భేదము లేదను సత్యము గోచరమగును.

175. మనస్సు కోతిలాంటిది. దీనికి నామ మనే కళ్ళెం వేసి మాటిమాటికి మరల్చుచుండవలెను.

176. శరీరము ధనాది కార్యములతో కూడుకున్నది. సత్పురుష సాంగత్య మనే ప్రయాగలో స్నానముచేయుటే దానికి శాంతి.

177. కాకి కోకిల కాకపోవచ్చును. గాని సత్పురుష సహవాసమున సత్సంగలాభమున కాకిభావం (కఠోరంగా పల్కువారు) కోకిలవలె అతి మధురంగా పల్కగలరు.

178. భగవ దాశ్రయములో నున్న వారికి రోగము కూడ అనుగ్రహరూపముగానే గోచరించును.

179. రోగికి నామముకంటె పరమౌషధం ఇంకొకటి లేదు.

180. దేహమునకు రోగమని దీనికి సుఖమును గల్గజేయుటకు ప్రయత్నించిన, విషయములలో జొచ్చిన విషముకంటే ప్రాణహానిని గల్గజేయును.

181. పరుల దోషముల జూచువాడు ధర్మాత్ముడు కాడు.

182. తనయొక్క, ఇతరులయొక్క దోషములు జూచువానిలో ధర్మము ప్రవేశించదు.

183. తన దోషముల చూచుకొనువానికి భక్తి యబ్బును. కాని సర్వత్ర ఈశ్వర నిష్ఠ కుదురదు.

184. అంతయు రామమయముగా చూచు వానికి సర్వత్ర ఈశ్వరనిష్ఠ కుదురును.

185. లోకమున మానవుడు చేయతగినది హరి నామమే.

186. సర్వకోరికల నిచ్చు కామధేనువు హరి నామమే.

187. నాలు గాశ్రమములవారు, నాలుగు జాతుల వారు చేయతగిన ప్రధానకర్మలలో హరినామము మిన్న.

188. అన్నికోర్కెలు త్యజించి ప్రతిజీవిలో "భగవాను"డున్నాడను దృఢభావనచేసి వివేకముతో సత్పురుష పథము అవలంబించిన నాడు నామానుగ్రహము తొందరగా ఫలించును.

189. రామాయణపఠనం-నామస్మరణ ఒక్కటే.

190. భగవన్నామ ప్రపన్నతయే సర్వోత్తమము.

191. మనస్సునుబట్టి చూస్తే అన్నీ దొంగవేష ములే.

192. నిరంతరం ఏదోవిధంగా భగవన్నామం చేయటమేగాని దాసోఽహం చేతకాదు. సోఽహం అసలే చేతకాదు.

193. భగవన్నామం తృప్తిని, సుఖాన్ని, శాంతిని పరమానందాన్ని ప్రసాదించును.

194. ఎప్పటికైనాసరే దృఢంగా, గాఢాను రాగంతో నామంలో మునగాలి.

195. భగవన్నామం సులభం. దానియందు శ్రద్ధ గలుగుట దుర్లభం. ప్రయత్నించిన ప్రేమ లభించి తీరు తుంది.

196. రాగద్వేషములు గలిగి యుండుట ఆత్మ హింస.

197. పరిచ్ఛిన్ను డనుకొనుట ఆత్మహింస.

198. ఏవిలేకున్నను ఆత్మవుండనిదికాదు. ఆత్మను చంపువా డెవడూ లేడు.

199. అనారోగ్యం అనాథనాథుని అనుగ్రహ విశేషం.

200. దుఃఖం దైవానుగ్రహం కాకపోతే కారణ మేమున్నది?

201. సర్వార్పణము జేసికొన్నవాడు భగవదిష్ట మని సంతోషించుతాడు. అట్టివానికి కష్టాలు లేవు. పరీక్షా లేదు. నిత్యసంతోషంగా యుంటాడు.

202. స్థిరత్వము నొందువరకు నామజపము చేయ వలయును.

203. భగవదనుగ్రహమున హరినామము నాశ్రయించి ప్రాపంచిక విషయములలో ముగ్ధులై యుండక యుండువారే భాగ్యవంతులు.

204. సదా మనస్సును వశపరచుకొనుము. మనస్సు మహా నీచమైనది. అది బందిపోటు దొంగ. దైవీసంపదను అపహరించును.

205. మృత్యువు సమీపమందున్నదని గుర్తించి నామజపము చేయుటయందు ప్రమాదమును పొందవలదు.

206. నిరంతరము భగవదనుకూల కార్యమే చేయ వలెను. ఏకార్యమువలన భగవంతుడు ప్రసన్నుడగునో అదియే జేయవలయును.

207. భగవంతుడు నేను జేయుకర్మను జూచు చున్నాడని తెలిసికొనుము. దానిచే నీచకర్మ చేయజాల కుందువు.

209. దృశ్య పదార్థములయందు మనస్సు పోనీయక భగవంతునియందే మనస్సు నుంచుము.

210. దుఃఖమును సుఖముకన్న యెక్కువగ తలంచుము. సంసార దుఃఖము నిన్నేమియు చేయజాలదు.

211. కలిలో భగవన్నామం భాగవతం ప్రధాన సాధనాలు.

212. భగవన్నామాని కున్న సిద్ధులు మరియే సాధనకూ లేవు.

213. భగవన్నామంచైతన్యం. తన నిజస్వరూపాన్ని తెలుసుకున్న వాళ్ళందరు భగవంతుని కభిన్నమని చెప్పుటకు పరమసాహసం భగవన్నామం వల్లనే అందుతుంది.

214. నామం చేయగాచేయగా దృఢత్వము, అనురాగము, ఏకాగ్రత నామం ప్రసాదిస్తుంది.

215. ఇతరులకు బోధించుటకంటె, తను ఆచరించిననాడు వారిని ఆదర్శముగా గొని తరింపగలరు.

216. తనతప్పు తాను చూచుకొనుటము-ఇతరులను పొగడకుండుటయు (అంటే భక్తుల పనికాదు అర్థము-ధనమే జీవనముగా గలవా రని అర్థము) నామరసాస్వాదనము-నిరంతర నామజపము యీ నాలుగే మహావాక్యాలు.

217. భగవద్భజనలో సర్వలాభ మున్నది. దాని ఉపేక్షలో సర్వనాశమున్నది.

218. భగవత్కథాశ్రవణంవలన అపవర్గ మార్గంలో నడచుటకు యోగ్యత కలుగును.

219. ఇతరములైన యెన్నో మాటలవలన లాభమేమి? గోవిందుని చింతించునదే ధ్యానము.

220. ఎక్కడ కేశవుని కీర్తన జరుగుచుండునో అదే కథ.

221. శ్రీకృష్ణుని ప్రసన్నత చేయునదే కర్మ. ఇతర మాటలవలన లాభమేమి?

222. భగవంతుని పాదపద్మములు కోరికలు లేని వారికి స్వధామము నొసగును.

223. అంతా రామమయం. ఈజగ మంతా రామ మయం.

224. ఏనాలుక "శ్రీకృష్ణ-శ్రీకృష్ణ-శ్రీకృష్ణ" అని శ్రీకృష్ణనామమును కీర్తించదో, రోగరూపిణి యైన ఆనాలుక నూరుముక్కలై పడుగాక !

225. సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ.

226. సత్యం జ్ఞాన మనంతం నిత్యం.

227. ఏమీ అనడంచేతకాకపోతే "శ్రీరామ" అనే మూడక్షరాలు చెవులార విన్నాచాలు.

228. స్వధర్మాచరణం చేయలేని కలిలో నుంచుని కూర్చుని, నడచుచు నైనా భగవన్నామం చేసికొనుట పరమధర్మం.

229. ఎవడు జగత్తును చూస్తాడో వానికి దుఃఖం తప్పదు.

230. ఎక్కడ జూచినా నీయిష్ట దేవునిగాజూడుము

231. శివుని కర్మలు అన్నియుచేసినను, చేయకున్నను "శివ" అనిన చాలును.

232. శివనామము లన్నిటిలో "శివ" అనునది చింతామణి.

233. "శివ" అని హేళనగా అన్నా మహాపాపం కూడ భస్మం అవుతుంది.

234. నాలుగువేదాలు చదివినాసరే, భగవన్నామం చేయకపోతే స్వర్గమేగతి.

235. ఏమీచదవకపోయినా భగవన్నామంచేస్తే అపవర్గం నిశ్చయం.

236. జీవితమును భగవత్పరం చేసుకున్నవాడు జగత్తుకు గురువౌతాడు.

237. ధనపరం చేసుకున్నవాడికి జగత్తు గురువై కూర్చుంటుంది.

238. పరిశ్రమలేకుండా, చదువులేకుండా, భాష్య శ్రవణం లేకుండా "రామరామ" అంటే ముక్తివస్తుందా? సందేహంలేదు. రామనామం వేదసారం.

239. భగవదిచ్ఛకు భిన్నంగా ఏమీ జరుగదు.

240. భగవద్భజనకన్న శాంతికి వేరుమార్గంలేదు

241. భగవంతుని హస్తంలేకుండ ఏమీజరుగదు.

242. ఈ ఉపాధులన్నీ కేవలం యంత్రములు.

243. భగవంతుని భజిస్తూ సుఖదుఃఖాలు ఆయన అనుగ్రహమే యని భావించుటయే ఆయనను వదల కుండా యుండటము.

244. మానవుడు ఏదిచేసినను మంచిబుద్ధితో చేసిన అంతయు మంగళమే.

245. భగవంతుని నమ్మినవాడు ఎన్నడు చెడడు.

246, భగవంతుని కటాక్షము ఎవనియందు ఎపుడు ఏవిధముగా ప్రసరించునో తెలియదు.

247. భగవంతుని ఆజ్ఞలేకుండ గడ్డిపరకకూడ చలించదు.

248. అంతా మనంచేస్తున్నా మనుకొనుట అజ్ఞానము.

249. నామసంకీర్తన తన్మయత్వముతో నాయీ శరీరము భగవంతుని కంకిత మగుగాక.

250. నామమునగల రుచి యేపదార్థమున లేదు.

251. భగవంతుడు సర్వత్ర ఉన్నాడని మరచుటచే హెచ్చుతగ్గులు, ప్రియాప్రియములు, నీచఉచ్చములు మనసున గలుగుచుండును.

252. శ్రీరామ విముఖుని బ్రతుకు వర్షాకాలమున పేడవలె వ్యర్థమగును.

253. శ్రీరామవిముఖునకు చిత్తదోషమున పాపమయమగు వృత్తి జనించును,

254. తనపాపముల వలెనే ఇతరులపాపములను తలంపని వానికి పాపములు సంభవించవు.

255. త్యాగవైరాగ్యములు లేనిచో భగవత్ప్రాప్తి కలుగదు.

256. సత్సంగ మెంతయుండునో దానికి రెట్టింపు మననము ఉండవలయును.

257. మననము లేకుండ సత్సంగము ప్రయోజనము లేదు.

258. నామజపమువలన విక్షేపనివృత్తి, పదగానమువలన లీలావిర్భావము గలుగును.

259. నిరంతరము నాగుణములను, లీలలను,నామసంకీర్తనము చేయవలెను. (భగవంతుడు)

260. జాత్యభిమాని యేజాతిని అభిమానింప జాలడు.

261. శరీరాభిమాని యే జీవునియందు దయజూప జాలడు.

262. రామనామము మహావాక్యము – మహామంత్రము.

263. భగవన్నామస్మరణకు దేశ, కాల, జాతి, వర్ణ నియమములు లేవు.

264. రామనామాశ్రయులకు కలిభయము, కాలభయము, మృత్యుభయము ఉండదు.

265. ఈకలిలో నామావతారంగా వచ్చిన శ్రీకృష్ణునికి అంతర్థానమనటం చేతకాకుండ పోతోంది,

266. చంచలమైన చిత్తము నలువైపులా పరువెత్తుచుండును.

267. నామోచ్చారణ మాత్రమున భవసాగరము ఎండిపోవును.

268. గురువును నమ్మిన సాధకునకు ఏవిఘ్నేపములు ఉండవు.

269. ఎవుడు మానవుడు సమస్తకర్మలను పరిత్యజించి నన్ను సర్వాత్మనా శరణు పొందునో అట్టి సమయమున అతడు నాకు విశేషమాననీయు డగును.

270. కీర్తనద్వారా క్రమక్రమముగా చిత్తమాలిన్యము క్షాళన మగుచుండును.

271. నాథ క్తి నిబొందగోరు వారు అమృతమయము లైన నాకథలయందు శ్రద్ధగలిగి యుండవలయును.

272. ఈశ్వర విముఖునకు భగవన్మాయచే తన స్వరూప విస్మృతి కలుగును.

273. తనగురువునే ఆరాధ్య దేవునిగా భావించవలెను.

274. దేహాభిమానముగల జీవుడు సంసారచక్రమున అనాదికాలమునుండి భ్రమించుచున్నాడు.

275. భగవంతుని గుణ, లీలలను మననము చేయుట లాభదాయకము.

276. నామసంకీర్తన కన్న మించిన పరమలాభ మింకొకటి లేదు.

277. రామనామము పరమశాంతిని కలిగించును.

278. స్వార్థముతోగాక పరమార్థముతో చేసిన సేవ సమాధివరకు గొనిపోవును.

279. పరేచ్ఛాప్రారబ్ధము కొంత నీసాన్నిధ్యము నకు దూరము చేయును.

280. రామనామమనే అద్భుతమైన రెండునాలుకలు గల కత్తెర ద్వైతభావమును కత్తిరించివైచును.

281. రామనామము జగత్తున కధిష్ఠానము.

282. రామనామం బ్రహ్మలోకంవరకు ఉన్న సంపదను తలపుకు రాకుండ చేస్తుంది.

283. భగవన్నామం చేసేవారికి స్వర్గం అసహ్యం అవుతుంది.

284. భగవన్నామం పట్టిస్తే గోపబాలురకు వలె జయం నిశ్చయం.

285. దేవతలు పానంచేయు అమృతముకంటే రామనామామృతం గొప్పది.

286. కల్మషచిత్తులు, పాపద్రవ్యముచే జీవించువారు, విధివిహిత కర్మలు చేయనివారు అగు కలిప్రజలకు గోవింద కీర్తనమే గతి.

287. నాభక్తుడు భక్తుడుకాడు. నాభక్తులకు-భక్తుడు నాకు సర్వోత్తమ భక్తుడు. "భగవాన్"

288. దురాగ్రహమే మాయావిజృంభణము.

289. మానవుడు అధ్యాసవల్ల (మిథ్యాజ్ఞానము) అనర్థముల పాలవుతాడు.

290. మహాభక్తుల పాదధూళి శిరమున ధరించుట ఎంతభాగ్యమో.

291. ఎవరితో యేమిచెప్పినా ఈచేతకానివానికి తోచినది యొక్కటియే ఉపాయము. "ఎల్లపుడు భగవన్నామం చేయుడు."

292. బంసీవటమువంటి వటము (మఱ్ఱిచెట్టు) లేదట.

293. సద్విచారము, సత్సంగము కలవారే ధన్యులు.

294. నిరహంకారముతో నీభక్తుల పాదధూళి అభిషేకము చేసికొను అవసరము ప్రసాదింపుము.

295. భక్తులసేవ భగవత్సేవ కభిన్నము.

296. శ్రీహరినామము మహాపాతకము లను కొలనులను ఎండించుటకు గ్రీష్మఋతువు.

297. ధనమదాంధులకు భగవన్నామము వెగటు,

298. ఏసత్కార్యము చేయకున్న శరణన్నవారిని రక్షించును భగవంతుడు,

299. భక్తప్రియుడు భగవానుడు.

300. భగవంతునకు అనంతనామములు జీవుల జీవ భ్రాంతిని తొలగించుటకే.

301. జీవుడా ! దేహచింత, అర్థచింత సర్వమును వదలుము.

302. స్థిరత్వము నొందువరకు నామజపము చేయుము.

303. కథాశ్రవణము కీర్తన ద్వారాక్రమముగా చిత్తమాలిన్యము తొలిత మగుచుండును.

304. నామ సంకీర్తనవలన సూక్ష్మ వస్తువు యొక్క యథార్థ తత్త్వదర్శనము లగుచుండును.

305. నాభక్తిని పొందగోరువారు అమృత మయమైన నాకథలయందు శ్రద్ధ యుంచవలెను.

306. ఈశ్వర విముఖునకు జగన్మాయచే తన స్వరూప విస్మృతి కలుగుచుండును.

307. అనన్యభక్తి ద్వారా ఈశ్వర భజనచేయ వలెను.

308. ప్రారబ్ధ బలము ఎటులాగునో ఎవరికిని తెలియదు.

309. నామజపమున ఎట్టివారికి సిద్ధి కరతలా మలకము,

310. అఖండమైన ఆత్మతత్త్వమును మంత్రాను గ్రహమున పొందగలరు.

311. ఈ సర్వ నామ, రూపములు విష్ణువు, విశ్వరూపుడే.

312. గురునిష్ఠపరులకు అలభ్యము, అసాధ్యము ఏమీ లేదు.

313. భగవదిచ్ఛకు అడ్డులేదు.

314. ఈశ్వరేచ్ఛకు మానవయత్నం అక్కర లేదు.

315. భగవదాశ్రయులకు వచ్చేవి పరీక్షలే అన్యింగాదు.

316. సర్వార్పణం చేసికొన్నవాడు భగవదిష్ట మని సంతోషించుతాడు.

317. భగవదాశ్రయంలో జారకుండా ఉంటే అన్ని యోగ్యతలు కలుగుతాయి.

318. మట్టియొక్క శక్తి కుండే-పరమేశ్వరుని శక్తి ప్రకృతి.

319. అలలు ఆగినపిదప సముద్రస్నానం చేయ వలయునని ఆగినవాడు మూర్ఖుడు.

320. శరీరధర్మముయొక్క నాశనా నంతరము నేను ముక్తిని బడయుదు ననుట మూర్ఖత.

321. ఆత్మసందర్శనమున వాసనలు మరలును

322. తనకు పుట్టిన దూడయొక్క మలమును ఆవు ఏలాగున శుభ్రముచేయునో, తనను పూర్తిగ నమ్మిన భక్తునియొక్క మలమునుగూడ భగవంతుడు శుభ్రముచేయును.

323. భక్తునికి వచ్చిన కించిత్ అహంకారమును భగవంతుడు వెంటనే నశింపజేస్తాడు.

324. జీవభావం వచ్చినపుడల్లా దేహబుద్ధి విజృంభించును.

325. జ్ఞానసిద్ధికి భక్తియే సులభోపాయము, పరమాశ్రయము.

326. శరీరానికి ఊహించని బాధలు రావటం మంగళకరము.

327. బుద్ధిని సదాశ్రయంలో వుంచకపోతే, శరీరాన్ని చిరంజీవిలా వుంచా లనుకుంటుంది.

328. బుద్ధి సదాశ్రయం ధృఢప్రయత్నంతో కలిగించాలి.

329, బుద్ధి దేహంతో పొత్తుకలిగి యుంటానం టుంది. మంచిది కాదు.

330. భగవంతుని కరుణ అపారము.

331. గృహాదులయందు అహంకారముతో నేను నాది యనుకొనుట దుర్జనత్వము.

332. దేహాదులయందువిష్ణుబుద్ధి గలిగి యుండ వలయును.

333. పరమపదమును పొందదలచువారు ఇతరుల యొక్క కటు వచనములను సహించాలి.

334. అపకారికి ఉపకారము చేయాలి.

335. అపకారికి-అపకారము చేయుట అనర్థము

336. దుఃఖం దైవాను గ్రహము.

337. భగవంతుని దగ్గరకు చేరువారికి విఘ్నములు ఎక్కువ.

338. సాధకుని సాధనకు విఘ్నములు భగవంతుని పరీక్ష.

339. "మమమాయా దురత్యయా" ఇది పరమ సత్యము.

340. బుద్ధిలోగల సూక్ష్మజ్ఞానం కూడ రామ నామంతో పటాపంచలవుతుంది.

341. శ్రీరామ చింతన దంభ రహితంగా జరగాలి.

342. క్షణభంగురమైన శరీరమునందు అహంకార మను మమకారములతో యేప్రాణితోను వైరము కలిగి యుండరాదు.

343. వాసుదేవుని కన్న పరమమంగళం మరి యొకటి లేదు.

344. వాసుదేవునికంటే పరమపవిత్రం ఇంకొకటి లేదు.

345. వాసుదేవునికంటే వేరుదైవము లేదు.

346. వ్యాధిరూప విలాసంగూడ, ఆత్మాభిన్న జగత్తువలె అధిష్ఠానాభిన్నమే.

347. అన్నిటికి అధిష్ఠానమైన "నేను" సర్వమంగళము.

348. అనుభవం కాకపోయినా అసలు బ్రహ్మవిలాసమే.

349. శరీరము, వ్యాధి, బాధలు, ఏడుపులు, జన్మలు, మరణాలు వాసుదేవుడే.

350. మనకు శాస్త్రమాత్రయే ఆశ్రయము.

351. తనకు అత్యంత ప్రియమైన వస్తువు ఎప్పుడూ జ్ఞప్తిలోనే ఉండటం సహజం.

352. అంతా బ్రహ్మమె అని సాధనచేస్తున్నా లోపల నున్న అసలు వాసన సమయానికి బయట పడుతుంది.

353. అంతరంగిక వాసనలవలన మనోనిగ్రహము, జిహ్వాను అరికట్టడము చేతకాదు.

354. నమ్మినవారిని ప్రేమించి తరింపజేయువాడు భగవంతుడు కాక మరెవ్వరు ?

355. వాసనలు పునర్జన్మకు హేతు వగును.

356. జిహ్వ ప్రాణం తీస్తుంది మనస్సు గాలిలో పడేస్తుంది.

357. తనకు తాను ప్రియమైనట్లు అన్యవస్తువులు కావు.

358. అన్యులవలన సుఖదుఃఖములు గలుగు చున్న ననుట పొరపాటు.

359. ఒకరికి దుఃఖమైనది యింకొకరికి సుఖం కాక తప్పదు.

360. రామనామం కలిదావానలమునకు చల్లని జలం వంటిది.

361. కలిమహా విటపమునకు రామనామం కుఠారం వంటిది.

362. ఉపాసకులకు యిష్టమైన వస్తువు భగ వంతుడు.

363. పరచర్చను విషమువలె విడువవలయును.

364. పరులదోషములు వినుటచే పాపము లభిం చును.

365. అన్యచింతనవలన మనస్సు మలినమగును.

366. బాహ్యదృష్టి త్యాగము గోడమీద వ్రాసికొనవలయును.

367. మనసుకు అన్యచింత కలిగినవుడు ఉచ్ఛ స్వరముతో నామం చేయుము.

368. భగవంతుని పొందుటకు అనేక ఉపాయ ములున్నవి.

369. కలిలో భగవంతుని పొందుటకు ఒక్క భగవన్నామమె ఆశ్రయము.

370. ఏరిఏరి పాపులను రక్షించునది యెవరు ? రాము డొక్కడే.

371. రాళ్లను, పక్షులను, చెట్లను రక్షించినది యెవరు ! రాముడేగదా !

372. దేవతలు, దానవులు, మునులు-అందరు మాయావివశులే.

373. "స్వ" అను నది అంతులేనిది.

374. "స్వ" ఆనందమయము, అద్వయము.

375. భగవంతుడే బుద్ధియోగాన్ని కూడా యిస్తాడు.

376. చచ్చెద ననుకొనుట ఆత్మహింస.

377. భగవన్నామం ముంగ అమృతముకూడ తీసికట్టు.

378. తల్లి తండ్రులు, గురు, దైవములు భగవద్విభూతులు.

379. భగవద్విభూతులను భగవదాదేశాను సారంగా మొదట సేవించాలి.

380. సగుణోపాసన సవ్యంగా జరిగితే తత్వము హస్తహాగత మౌతుంది.

381. ఈకాలంలో సగుణోపాసనగూడ సరసంగా చేయలేరు.

382. నిర్ధనుని పాపం నామం పోగొట్టుతుంది.

383. "భాగవతం" అనుమాట దేవతలకుకూడ దుర్లభం.

384. కలిలో అపవర్గసాధనం "రామ"నామమే మరొకటికాదు.

385. భూలోకంలో భాగవతం బ్రహ్మవిగ్రహం.

386. భాగవతం సాక్షాత్ శ్రీకృష్ణుడే.

387. భాగవతం విన్నవారికి, వినిపించిన వారికి శ్రీకృష్ణానుగ్రహం సమమె.

388. ఏకాంతవాసంమనోనిర్మలతకుసత్యోపాయం.

389. ప్రపంచము యథార్థముగాదు మిథ్య.

390. నామసంకీర్తన కాలమున నామం దృశ్యమను తలంపులేకుండ జరుగుట ఉత్తమము.

391. భగవన్నామం అశ్రమాహంకారములను నశింపజేయును.

392. శరీర మెచటెచట వచ్చినను-నామాసక్తి కలుగుట భాగ్యము.

393. దేహము జీర్ణించునదిగాన "శరీర" మన్నారు.

394. అహంకార అంకురము దేహబుద్ధిని గలిగించి సర్వనాశనము జేయును.

395. జీవితమునగల్గు అనర్థములు నామస్మరణచే నశించును.

396. మనము ఏపూటకాపూట మనసును గమనించకపోతే పాచిపడుతుంది.

397. భగన్నామం కైవల్య మొసగు కామ ధేనువు.

398. హరినామము పురుషార్థముల నిచ్చును.

399. నామోచ్చారణ మాత్రమున భవసాగర మెండిపోవును.

400. రామనామము సదా శివుడు జపించు చుండును.

401. బుద్ధి యోగము లభింపనివారు దుఃఖం అనుభవింతురు.

402. మంగళము-అమంగళము భగవంతుడే.

403. భగవన్నామం అరిషడ్వర్గాలను తొలగి గిస్తుంది.

404. భగవంతుని నామ, రూప, ధామములు-మరియు భక్తికూడ అమృతమే.

405. భజనకు బలంరావాలంటే వ్యాపకంగా ఉన్న స్వరూపంగూడ మనస్సు అందుకోవాలి.

406. నామార్థచింతనం, రూపార్థచింతనం వీని వలన భగవంతుడు తన వాస్తవరూపాన్ని అందివ్వకుండునా ?

407. సగుణోపాసనమే నిర్గుణోపాసనకు చరమోపాయము.

408. సగుణ పరిచయం పూర్తిగాకుండ యీ దినములలో వేదాంతులకు రాగద్వేషములు పోవడంలేదు.

409. వేదాంతులకు ద్వైతభ్రమ అధికంగా గోచరించుచుండును.

410. సగుణ పరిచయం పూర్తిగా గానిచో వేదాంతం విషంగా పరిణమిస్తుంది.

411. రామనామము జపించువారిని చూచినా, స్పృశించినా, అట్టివారి పాపములు తొలగిపోవును.

ఈ గ్రంథ ముద్రణకు ఈ క్రింది భక్తులు సాయముచేసిరి.

| | | |
|---|---|---|
| 1. | శ్రీ రమణాశ్రయులు - అరుణాచలం | 25-0 |
| 2. | శ్రీ ఎ కనకరాజుగారు - హైదరాబాదు | 250-0 |
| 3. | శ్రీ వెల్లంకి కొండలరావుగారు - నల్లజర్ల | 100-0 |
| 4. | శ్రీ తటపర్తి రాజశ్యామల -తెనాలి | 100-0 |
| 5. | శ్రీ గుంటూరు సీతారామశాస్త్రిగారు- రామగుండం | 100-0 |
| 6. | శ్రీ ఘంటాచిట్టెయ్యగారు నల్లజర్ల | 100-0 |
| 7. | శ్రీమతి పసుమర్తి సత్యవతమ్మగారు - విజయవాడ | 58-6 |
| 8 | శ్రీమతి ముళ్లపూడి సత్యవతమ్మగారు ,, | 58-0 |
| 9. | శ్రీ దంగేటి లక్ష్మినారాయణగారు - గొల్లప్రోలు | 58-0 |
| 10. | పి. రవిశంకరంగారు - తణుకు | 50-0 |
| 11. | పి. శ్రీరామమూర్తిగారు - విశాఖపట్నం | 40-00 |
| 12. | శ్రీభక్తాంజనేయస్వామివారి సంకీర్తన సమాజము రామగుండం | 32-10 |
| 13. | శ్రీ బొడ్డపాటి సత్యనారాయణగారు విజయవాడ | 25-0 |
| 14. | శ్రీ అక్కిపెద్ది అన్నపూర్ణమ్మగారు ఢిల్లీ | 15-0 |
| 15. | శ్రీ చల్లా కనకదుర్గమ్మగారు ,, | 10-0 |
| 16 | శ్రీ అంకరాజు సరోజనమ్మగారు తెనాలి | 5-00 |
| 17. | శ్రీ పసుమర్తి సుబ్రమణ్యశాస్త్రిగారు- విజవాడ | 25-0 |
| 18. | శ్రీ ముళ్లపూడి భానువెంకటసత్యనారాయణగారు ,, | 25-0 |
| 19. | శ్రీ రూపాకుల సుందరమ్మగారు-తెనాలి | 15-0 |
| 20. | శ్రీ మురికిపూడి వరదరాజులుగారు | 10-0 |
| 21. | శ్రీ జంధ్యాల లక్ష్మినృసింహస్వామిగారు తెనాలి | 5 0 |
| 22. | శ్రీ వెల్లంకి నారాయణమూర్తి దంపతులు-నల్లజర్ల | 6-0 |
| 23. | ఒక భక్తురాలు తెనాలి | 30-0 |
| 24. | ఒక భక్తుడు ,, | 10-0 |

మారాబోవు అవధూత గ్రంథములు. అపరచైతన్యులు, నా మావతారులు, ప్రాతః స్మరణీయులు, బ్రహ్మీభూతులు అగు శ్రీశ్రీశ్రీ ప.ప. అవధూతేంద్ర సరస్వతీ స్వామివారు వ్రాసికొనిన గ్రంథములను సేకరించి, మా మండలి ద్వారా ప్రకటించిసాధక భక్తలోకమునకు అందించ నిశ్చయించితిమి.

1. అవధూతవాణి (అచ్చగుచున్నది)
2. అవధూతలేఖలు
3. శ్రీకృష్ణ-ఉద్ధవసంవాదం
4. గోపికా గీత (విశేషార్థము)
5. నిత్య పఠన స్తోత్రములు
6. శ్రీస్వామివారు - అరుణాచలము
7. శ్రీస్వామివారు - నామసప్తాహములు
8. భగవన్నామ మహిమ (వేద శాస్త్ర పురాణాదుల నుండి)
9. శ్రీస్వామి వారి జీవిత చరిత్ర
10. అవధూత పలుకులు
11. అవధూత సూక్తులు. ద్వితీయ భాగము

సాధన గ్రంథ మండలి, తెనాలి.